శ్రీః

శ్రీమతేరామానుజాయనమః.

శ్రీమదనంతాంశసంభూతులగు

భగవద్రామానుజమునీంద్రులు

చేతనులిహపరంబులయందు ఉజ్జీవించి

సుఖించుటకొఱకై సాయించిన

# ఎనబదిరెండువార్తలు.

ఇవి

యనమదల - అనంతాచార్యులవారిచే

శ్రీమదుమామహేశ్వరముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపంబడినవి.

చెన్నపురి.

౧౯౦౧ సంవత్సరము.

దీనివెల అణాలు ౨

❋❋❋❋❋❋❋❋❋❋❋❋❋❋❋❋❋

## శ్రీమతే రామానుజాయనమః.

---

శ్లో॥ విష్ణుశ్శేషీతదీయశ్శుభగుణనిలయో విగ్రహశ్శ్రీశఠారిః । శ్రీమాన్ రామానుజార్యః పదకమలయుగం భాతి రమ్యంతదీయమ్ । తస్మిన్ రామానుజార్యే గురురితిచపదం భాతినాన్యత్రతస్మాత్ శిష్టం శ్రీమద్గురూణాం కులమిదమఖిలం తస్యనాథస్య శేషః॥ ❋

సర్వవ్యాపకవస్తువుశరీరి, శ్రీశఠగోపులు - తత్సంబంధమైనసమస్తకల్యాణగుణనిలయమగుశరీరము, జ్ఞానసంపన్నులగు శ్రీఉడైయవరులు - ఆశ్రీశఠగోపులయొక్క రమ్యమైన రెండు తిరువడిత్తామరలుగా ప్రకాశించుచున్నారు. గాన అట్టి శ్రీరామానుజాచార్యులయందే (ఆచార్యపదమెన్నుతనియేయొరుపదం అదుశ్లదు ఎంబెరుమానార్కే యుని పూర్వాచార్యులుసాయించినప్రకారము) ఆచార్యపదము ప్రకాశించుచున్నది. ఆయాచార్యపదము అన్యులయందులేదు. కనుక జ్ఞానసంపన్నులైన సకలాచార్యపురుషులు వారికి శేషముగాయున్నారు॥ ❋

శ్లో॥ భూతంమస్తకమక్షిణీప్రాదమహత్పూరీచభట్టేశ్వరం వక్త్రంభక్తిభునంగళం కులశిరో భూషంమునింగాయకం । దోర్యుగ్మం హరిదాసపద్రజఉరో నాభింకలిధ్వంసినం శ్రీపాదం మధురంకవిం యతిపతించాహుశ్శఠారేర్బుధాః॥ ❋

శ్రీనమ్మాళ్వారులకు - పూదత్తాళ్వార్లను శిరస్సునుగానున్ను, పేయ్గాయాళ్వార్, పేయాళ్వార్లను -







శ్రీమతే రామానుజాయనమః.




ఉడయవరులు పరమ
పదమునకు వేంచేయునపుడు
సర్వజనులు
కడతేరుకొఱకు తమశిష్యులకు సాయించిన.
౭౨ - వార్తలు.



ఉడయవరులు పరమ పదమునకు వేంచేయు నపు
సర్వజనులు కడతేరుకొఱకు తమశిష్యులకు సాయించి
అర్థవిశేషములను గురుపరంపరాప్రభావములో సాయిం
చియుండు ప్రకారము ఒక అధికారికి ద్వయముతప్పమ
త్రములేదనియు, మిథునముతప్పవస్తువులేదనియు, కైం
ర్యముతప్ప పురుషార్థములేదనియు, ఆచార్యాభిమానః
తప్ప మోక్షోపాయములేదనియు, భాగవతాపచారం
తప్ప మోక్షవిరోధములేదనియును సాయించిరి,



(ఇవి ప్రపన్నామృతమునుండి నెత్తిచేర్చబడినవి.)

శ్రీవైష్ణవాం శ్చమాహూయ తత్ర తత్రస్థి తాన్బ హూన్ । కృపామాత్ర ప్రసన్నార్యో యతిరాజో జగద్గురుః । సర్వశాస్త్రార్థసారాణి సువాక్యాని ద్విసప్తతిః। సమాహృత్య విధాయాశు భూరిదానం మహాయశాః। శ్రీవైష్ణవేభ్యః ప్రోవాచ శిష్యేభ్యః కరుణార్ణవః॥ ❋

జగద్గురువులును దయాసముద్రులును అయిన శ్రీ ఉడయవరులు చేత వోజ్జీవనార్థమై అక్కడక్కడగల యనేకులయిన శ్రీవైష్ణవులను బిలచి సర్వశాస్త్ర ప్రతిపాద్యములయిన దివ్యార్థములను సంగ్రహించి డెబ్బది రెండు శ్రీసూక్తులుగా నానతిచ్చి భూరిదానము చేసిరి. ❋

౧. స్వదేశికస్య కైంకర్యే కైంకర్యే వైష్ణవస్యచ। ప్రపత్తిం సుసమాం కృత్వా కైంకర్యం కారయేత్సదా॥

స్వాచార్య కైంకర్యమందును భాగవత కైంకర్యమందును సమప్రతిపత్తి చేయవలసినది॥ ❋

౨. పూర్వాచార్యోక్తవాక్యేషు విశ్వాసే నైవ వర్తయేత్॥

పూర్వాచార్యులు సాయించిన శ్రీసూక్తులయందు విశ్వాసము నుంచవలయును॥ ❋

౩. నవర్తయేదింద్రియాణాం కింకరశ్చ దివానిశం॥

నిరంతరము ఇంద్రియ కింకరులై యుండవలదు॥

౪. సామాన్యశాస్త్ర నిరతో నైవ తిష్ఠేత్కదాచన॥

సామాన్య శాస్త్రనిష్ఠులయి యుండవలదు॥

౫. భగవద్విషయే శాస్త్రనిరతస్సర్వదా వసేత్॥

భగవద్విషయక విశేష శాస్త్రనిష్ఠులయి యుండవల యును॥

౬. ఆచార్యకృపయా పూర్వం సంజాతజ్ఞానసాగరః
భూయశ్శబ్దాదివిషయకింకరో నైవ వర్తయేత్॥

తొలుత ఆచార్యకృపచే జ్ఞానినైయుండి పిదప శబ్దాదివిషయకింకరుడై యుండకూడదు.

౭. సర్వాంచ్ఛబ్దాది విషయాం త్సమానేవ విలోకయేత్॥

పైన జెప్పినట్టి శబ్దాదివిషయభోగములనైదింటిని సమముగా జూడవలయును॥

౮. పుష్పచందన తాంబూల ద్రవ్యాదిషు సుగంధిషు
వాసనారుచికాఙ్క్షాణికదాచినైవ కారయేత్॥

చందన కుసుమ తాంబూలాదులయందు ఆశ మాని యుండవలసినది॥

౯. యా ప్రీతిరాసీత్స్వకృతం భగవన్నామకీర్తనే। స
స్యాత్ప్రీతిహీనేతద్భక్తనామసంకీర్తనేపిచ॥

భగవన్నామకీర్తనలయందు జేయు ఆదరణ భాగవత నామకీర్తనలయందును జేయవలసినది॥

౧౦. కారణం భగవత్ప్రాప్తేర్మహాభాగవతాశ్రయ
ఇతిమత్వా దృఢం తేషామాజ్ఞ యా వర్తయేత్సదా॥

మహాభాగవతాశ్రయమే మోక్షకారణమని నమ్మి వారియాజ్ఞాప్రకారము నడవవలయును॥

౧౧. విహాయవిష్ణుకైంకర్యం కైంకర్యంవైష్ణవస్యచ।
వినశ్యేత్సనరః ప్రాజ్ఞో రాగాది ప్రేరితోయది॥ *

ఒకడు, ఎంతప్రాజ్ఞుడయినను భగవత్కైంకర్యమును భాగవత కైంకర్యమునువిడిచి రాగాదులచే విషయప్రవణుడాయెనానశించును॥ *

౧౨. వైష్ణవానామనుష్ఠానం నోపాయమితివిశ్వసేత్॥ *

శ్రీవైష్ణవుల యనుష్ఠానములు ఉపాయమని తలచకూడదు॥ *

౧౩. ఉపేయమేవసతతం విశ్వసేత్సుమహాత్మనాం॥

అట్టి శ్రీవైష్ణవానుష్ఠానమును ఉపేయమనితలచవలయును॥ *

౧౪. నాహ్వయేదేకవచనాన్మహాభాగవతాన్జనాః

శ్రీవైష్ణవులను ఏకవచనముగా పిల్వరాదు॥ *

౧౫. పూర్వాంజలింవైష్ణవానాం దృష్టమాత్రేణకారయేత్॥ *

శ్రీవైష్ణవులను సేవించునపుడే పూర్వాంజలి చేయవలయును॥ *

౧౬. హరేర్భగవతోవిష్ణోర్వైష్ణవానాంచసన్నిధౌ।
పాదౌప్రసార్యనవసేత్కదాచిదమలాత్మనాం॥ *

భగవద్భాగవతాచార్య సన్నిధిని కాళ్లుచాచరాదు॥

౧౭. విష్ణోర్గురోర్వైష్ణవస్యగృహాణాంచదిశంప్రతి।
పాదౌప్రసార్యనిద్రాంచకదాచిన్నైవకారయేత్॥ *

భగవద్భాగవతాచార్య తిరుమాళిగలదిక్కున కాళ్లు చాచుకొని నిదురించరాదు॥ *

౧౮. కృతనిద్రస్సముత్థాయవదేద్గురుపరంపరాం॥

నిదురపోయి మేలుకొనునప్పుడు గురుపరంపరానుసంధానముచేయవలసినది॥ *

౧౯. మహాభాగవతాన్దృష్ట్వానిషణ్ణాన్విష్ణుసన్నిధౌ।
కుర్వన్ద్వయానుసంధానంప్రణమేద్దండవద్భువి॥ *

భగవత్సన్నిధియందు శ్రీవైష్ణవులుతిరువోలక్కముగా వేంచేసియుండు నపుడు ద్వయానుసంధానము చేయుచు దండముసమర్పించవలయును॥ *

౨౦. సంకీర్తనంభగవతస్తథాభాగవతస్యవా । శ్రీవైష్ణవేషుకుర్వత్సు తాంచ్ఛక్త్యానాభిపూజ్యచ। మధ్యోత్థాయగమనముపచారతమంభవేత్॥ *

శ్రీవైష్ణవులుభగవద్భాగవతగుణకీర్తనలు చేయుచుండగా వారినితనశక్త్యనుసారముపూజింపక మధ్యనులేచిపోవుట మిక్కిలియపచారము॥ *

౨౧. వైష్ణవాగమనం శ్రుత్వాగచ్ఛేదభిముఖంతదా। సాకంగచ్ఛేత్క్వచిద్దూరంభక్త్యాతేషాంవినిర్గమే । ద్వయోరకరణాదాశుమహాన్దోషఃప్రజాయతే॥ *

శ్రీవైష్ణవులు వేంచేసిరేని లేచి వారికి యెదురుగాబోయిపిలుచుకొనివచ్చి వారుతిరుగావేంచేయునపుడు కొంతదూరముకూడపోయిపంపకుండుట యపచారము॥ *

౨౨. ఆమ్నాయాత్రార్థమనిశం శేషత్వేనచవైష్ణవాన్ విసయాదిగుణైర్భక్త్యానానుసృత్యమహాత్మకాన్। దేహ

యాత్రార్థమనిశం ప్రాకృతానాం గృహే గృహే। గత్వా
గత్వాథ నామాని తేషాం తేషాంచ సాదరం। స్వనామ్నః
పురతః కృత్వా నియమాదీన్విహాయ చ। వర్తనం వైష్ణవస్యా
స్యస్వరూపస్యైవ హానిదం॥ *

ఆత్మయాత్రకై శేషత్వముచే శ్రీవైష్ణవులను అనువ
ర్తింపక తన దేహయాత్రకు గాను సంసారుల యిండ్లకు పో
యి వారి పేరు ముందు తన పేరు వెనుక పెట్టుకొని నియమ
ములను విడిచి తిరుగుట స్వరూపహానికరము॥ *

౨౩. విష్ణోర్ద్రవ్య విమానాని గోపురాణి జగత్పతేః। దృ
ష్టమాత్రేణ సహసా కారయేదంజలిం తదా॥ *

జగన్నాథుడయిన స్వామి విమాన గోపురములు గనున
ప్పుడే లేచి అంజలి చేయవలయును॥ *

౨౪. దృష్ట్వేతర విమానాని విస్మయం నైవ కారయేత్
దేవతాంతర విమానాదుల చూచి నప్పుడు ఆశ్చర్య
పడరాదు॥ *

౨౫. శ్రుత్వా న విస్మయం గచ్ఛేద్దేవతాంతర కీర్తనం॥
దేవతాంతర వార్తలు విని సంతోషపడరాదు॥ *

౨౬. విష్ణోర్వా వైష్ణవానాంచ నామ సంకీర్తనానిచ।
కుర్వతః పుణ్యపురుషాన్ దృష్ట్వా నావాప్య వై ముదం। ఆక్షే
పో హ్యపచారస్స్యాత్తన్మధ్యే తేషాం సునిశ్చయః॥ *

శ్రీవైష్ణవులు భగవద్భాగవతాచార్యగుణ కీర్తనము
లు చేయుచుండగా విని సంతోషింపక నడుమను ఆక్షేపిం
చుట యపచారము॥

౨౭. శ్రీవైష్ణవానాం సర్వేషాం దేహచ్ఛాయాం న లంఘయేత్॥

శ్రీవైష్ణవులవిగ్రహచ్ఛాయను త్రొక్కరాదు॥

౨౮. స్వదేహచ్ఛాయసంస్పర్శం వైష్ణవేషు న యేత్॥

తననీడ శ్రీవైష్ణవులమీద పారేటట్టు నడవరాదు॥

౨౯. స్పృష్ట్వా సంసారిణః పూర్వం వైష్ణవాన్న సంస్పృశేత్॥

ముందు సంసారులను తాకి శ్రీవైష్ణవులను స్పృశి రాదు॥

౩౦. వైష్ణవాయ దరిద్రాయ పూర్వవందనకారిణే అనాదరాదికార్యాణి భవేయుః పాతకాని వై॥

దరిద్రులయిన శ్రీవైష్ణవులు ముందు వందనము జేయంగా ననాదరణజేయుట అపచారము॥

౩౧. యది ప్రణమతే పూర్వం దాసోహమితి వైష్ణవః అనాదరేకృతే తస్మిన్నపచారో మహాన్భవేత్॥

శ్రీవైష్ణవులు ముందు దాసోహమని ప్రణామము జేయగా ననాదరించుట మహా అపచారము॥

౩౩. శ్రీవైష్ణవానాం జన్మాని నిద్రాలస్యానియానిచ దృష్ట్వా తాని ప్రకాశ్యానుజనేభ్యో నవదేత్క్వచిత్। తేషాం దోషాస్వహాయాశు గుణాంశ్చైవ ప్రకీర్తయేత్॥

శ్రీవైష్ణవుల జన్మనిద్రాలస్యాదిదోషములను తనకు తెలిసినను ఒరులకు జెప్పక వారిదోషములను విడచి గుణములనే కీర్తింపవలయును॥

౩౩. విష్ణుపాదోభకంచైవ భక్తపాదోదకంతదా।
ప్రాకృ) తేషుచపశ్యత్సునపిబేత్తోయముత్తమం॥ *

భగవద్భాగవత శ్రీపాదతీర్థములను ప్రాకృతులుచూ
గా స్వీకరింపరాదు॥ *

౩౪- తత్వత్రయస్యజ్ఞానేనరహస్యత్రితయస్యచ। ర
హితస్యాంఘ్రిజంతోయంగ్రాహ్యోమేన్నకదాచన॥ *

తత్వత్రియరహస్యత్రయజ్ఞానములేనివారి శ్రీపాదతీ
ము ఒకప్పుడును గ్రహింపరాదు॥ *

౩౫. జ్ఞానానుష్ఠానయుక్తస్య సదాచారరతస్యచ।
పాదోదకంవైష్ణవస్యపిబేన్నిత్యంప్రయత్నతః॥ *

జ్ఞానానుష్ఠానములుగల సదాచారరతులగు భాగవ
తుల శ్రీపాదతీర్థమునిత్యముస్వీకరింపవలయును॥ *

౩౬. మయిభాగవతైస్సార్థం సామ్యబుద్ధింనకారయే
త్॥ *

తానుతనయందుభాగవతసమబుద్ధిచేయరాదు॥ *

౩౭. ప్రాకృతానాంచసంస్పర్శః ప్రాప్తఃప్రమాదీ
యది। స్నాతస్సచేలస్సహసావైష్ణవాంఘ్రిజలంపిబేత్॥

ప్రమాదికముగా ప్రాకృతస్పర్శకలిగినప్పుడు కట్టు
డ్డతోపోయి తీర్థమాడి భాగవతశ్రీపాదతీర్థముస్వీకరిం
వలయును॥ *

౩౮. వైరాగ్యజ్ఞానభక్త్యాదిగుణవంతోమహాత్మనః।
వైష్ణవాన్మహాభాగాన్మత్వాచరమవిగ్రహాన్। కుర్యా
) తేషువిశ్వాసంవిశేషేణమహాత్మను॥ *

జ్ఞానభక్తివైరాగ్యాది గుణములుగల మహాత్ములను
ఆచరమదేహులనివిశేషప్రతిపత్తిచేయవలసినది॥ *

౩౯. వైరాగ్యజ్ఞానభక్త్యాదిగుణవంతో మహాత్మనః।
యే యే భాగవతాస్తాంస్తాను ద్దేశ్యాఇతివిశ్వసేత్॥ *

జ్ఞానభక్తివైరాగ్యములుగల భాగవతులయందు జాతిగుణాది నిరూపణము చేయక వారలేతనకు ఉద్దేశ్యులని నమ్మవలయును॥ *

౪౦. నగ్రాహ్యే ద్విష్ణుతీర్థం ప్రాకృతానాంగృహేషుచ॥ *

ప్రాకృతగృహములయందు భగవత్తీర్థమయినను గ్రహింపకూడదు॥ *

౪౧. ప్రాకృతానాం నివాసస్థా న్నసేవే ద్విష్ణు విగ్రహాః॥ *

ప్రాకృతగృహములయందుండు భగవద్విగ్రహములనయిన సేవింపగూడదు॥ *

౪౨. శ్రీహరేర్దివ్యదేశేషుపశ్యత్సుప్రాకృతేష్వపి।
తీర్థప్రసాదగ్రహణంకుర్యాదేవనసంశయః॥ *

శ్రీహరిదివ్యదేశములయందు ప్రాకృతులుచూచుచుండినను సందేహింపక తీర్థప్రసాదములనుస్వీకరింపవలయును॥

౪౩. యదిశ్రీవైష్ణవైర్దత్తంప్రసాదం విష్ణుసన్నిధౌ।
ఉపవాసాదినియమయుక్తోహమితినత్యజేత్॥ *

భగవత్సన్నిధియందు భాగవతదత్తమయిన ప్రసాదమును ఉపవాసనియమయుక్తుండనని విడువరాదు॥ *

౪౪. ప్రసాదే పాప నేవిష్ణో స్సర్వపాపహరే హరేః
కదాచిదపిచోచ్ఛిష్టప్రతిపత్తింనకారయేత్॥ *

పరమపావనమయిన భగవత్ప్రసాదమందు వారి వీరికి యిచ్చినారని ఉచ్ఛిష్టప్రతిపత్తిచేయకూడదు॥ *

౪౫. సన్నిధౌ వైష్ణవానాంచ స్వగుణాన్నైవకీర్తయేత్॥ *

శ్రీవైష్ణవులసన్నిధిని తనగుణములు చెప్పుకొనరాదు॥

౪౬. శ్రీవైష్ణవానాంసాన్నిధ్యేనాన్యంపరిభవేజ్జనం॥

శ్రీవైష్ణవులసన్నిధిని మఱియొకరిని పరిభవించరాదు॥

౪౭. గుణానుభవకైంకర్యం తదీయానాం మహాత్మనాం। అవిధాయక్షణంవాపినకార్యంకించిదాచరేత్॥ *

మహాత్ములయిన భాగవతులగుణానుభవకైంకర్యములను క్షణమాత్రమయినను జేయక మఱియొక కార్యమును జేయకూడదు॥ *

౪౮. ఘటికాయాం దినైకస్యాంవర్ణయేద్గురుసద్గుణాన్॥ *

దినమునకొక గడియయయిన నాచార్య గుణములను వర్ణింపవలయును॥ *

౪౯. ఘటికాయాందినైకస్యామపివిశ్వాసపూర్వకం కావ్యాదిప్రబంధాన్వాప్రబంధాన్కీర్తయేద్గురోః॥ *

దినమున నొకగడియయైనను విశ్వాసపూర్వకముగా నమ్మాళ్వారులు మొదలగువారు సాయించిన తిరువాయ్మొళి మొదలగు ప్రబంధములను ఆచార్యవైభవమును వర్ణింపవలయును॥ *

౫౦. దేహాభిమానిభిస్సార్థంసహవాసంనకారయేత్॥

దేహాభిమానులతో సహవాసము జేయరాదు॥ *

౫౧. శ్రీవైష్ణవానాంచిహ్నానిధృత్వాపివిషయాతురైః। తైస్సార్థంవంచకజనైస్సహవాసంనకారయేత్॥ *

శ్రీవైష్ణవచిహ్నములుధరించుకొని విషయప్రవణులయి

యుండువంచకులతో సహవాసముచేయరాదు॥ ❋

౫౨. నభాషయేచ్చ సతతం పరదూషణతత్పరైః॥ ❋

పలుమారు పరులనిందించువారితో సంభాషింపరాదు॥

౫౩. దేవతాంతర భక్తానాంసంగదోషనివృత్తయే।
శ్రీవైష్ణవైర్మహాభాగైస్సల్లాపంకారయేత్సదా॥ ❋

దేవతాంతరభక్తులసంగదోషమును పోగొట్టుటకై మహానుభావులగు శ్రీవైష్ణవులతో సల్లాపము చేయవలయును॥

౫౪. తదీయదూషకజనాన్నపశ్యేత్పురుషాధమాన్
నైవావలోకయేత్క్రూరానపచారపరాన్నరా॥ ❋

భాగవతదూషకులయిన జనులను గాని ఆచార్యాపచారపరులయిన క్రూరులను గాని చూడకూడదు॥ ❋

౫౫. ద్వయైకనిష్ఠైః పురుషైస్సంగతింకారయేత్సదా॥

ద్వయానుసంధానపరులగు భాగవతులతో నెల్లప్పుడును సహవాసము చేయవలయును॥ ❋

౫౬. ఉపాయాంతరనిష్ఠాంశ్చ పురుషాన్విసర్జయేత్।
ప్రపత్తిధర్మనిరతైర్జనైస్సహావసేత్సదా॥ ❋

ఉపాయాంతరనిష్ఠులను ఉపేక్షించి ప్రపత్తి నిరతులైయునవారితో నెల్లప్పుడు సహవాసము చేయవలయును॥ ❋

౫౭. రహస్యత్రయసారజ్ఞైస్తత్త్వత్రయవిశారదైః। మహాభాగవతైస్సార్ధం సహవాసం చకారయేత్॥ ❋

రహస్యత్రయసారజ్ఞులు తత్త్వత్రయజ్ఞానవిశారదులునైన మహాభాగవతులతో సహవాసము చేయవలయును॥

౫౮. అర్థకామపరైస్సార్ధం కదాచిన్నవసేత్సదా।
భగవద్భక్తినిష్ఠైశ్చ సల్లాపంకారయేత్సదా॥ ❋

అర్థకామపరులతో సహవసించక భగవద్భక్తినిష్ఠుల తో సదాసల్లాపముచేయవలయును॥ *

౧౯. వైష్ణవేనతిరస్కారః కృతోపిహ్యభవత్తేయది। అపకారస్స్మృతింతస్మాదకృత్వామౌనతోవసేత్॥ *

శ్రీవైష్ణవులు తన్ను పరిభవించినను వారియెడ అపకారస్మృతిమాని మౌనముతోనుండవలయును॥ *

౨౦. సంజాతావైష్ణవస్యాసీద్బుద్ధిర్హ్యాపరమేపదే। శ్రీవైష్ణవేభ్యస్సర్వేభ్యః కారయేత్సతతంహితం॥ *

శ్రీవైష్ణవునికి పరమపదమందుబుద్ధికలిగినప్పుడు శ్రీవైష్ణవులకెల్ల హితముచేయవలయును॥ *

౨౧. ధర్మాదపేతంయత్కర్మ యద్యపిస్యాన్మహాఫలః। నతత్సేవేతమేధావీనహితద్ధితముచ్యతే॥ *

భగవదాజ్ఞావిరుద్ధములయిన కర్మలుమహాఫలప్రదములయినను వానిజ్ఞానాధికుడైన ప్రపన్నుడుచేయకూడదు॥

౨౨. నానర్పితాన్నంహరయేకదాచిదపిభక్షయేత్। పుష్పచందనతాంబూలవస్త్రాదకఫలాదికం । నానర్పితంతుహరయేత్కదాచిదపిధారయేత్॥ *

భగవన్నివేదితముగాని యన్నమునుభక్షింపకూడదు. పుష్పచందన తాంబూలాదులయినను భగవదర్పణములేకనుపయోగపరచుకొనరాదు॥ *

౨౩. సాధనాంతరసంప్రాప్తమర్థకామాదిహేతునా। అయాచితమపిప్రాప్తంనగృహ్ణీయాత్కదాచన॥ *

అర్థకామాదిసాధనములయిన సాధనాంతరములుచేయువారివలన అయాచితంబుగా నర్థాదులు దొరకినను గ్రహింపకూడదు॥ *

౬౪. జాత్యాద్యైర్దుష్ట మన్నాద్యం భుంజీయాత్తచ్చ సాదరం॥ *

జాత్యాశ్రయనిమిత్తదుష్టముగానియన్నాదులను ప్రపన్నుడుభుజించవలయును॥ *

౬౫. స్వదేహప్రియభోగాంస్తు నార్పయేత్పరమాత్మనే॥ *

తనకుయిష్టములనియెంచి పదార్థములను భగవంతునకు అర్పింపకూడదు॥ *

౬౬. శాస్త్రీయసర్వభోగాంస్తువిష్ణవేతాంత్సమర్పయేత్॥ *

శాస్త్రోక్తములయిన సర్వపదార్థములను శ్రీయఃపతికి సమర్పింపవలయును॥ *

౬౭. విష్ణ్వర్పితాన్నపానీయభక్ష్యాదిషుసుగంధిషు। ప్రసాదబుద్ధిఃకర్తవ్యాభోగబుద్ధిర్నక్వచిత్॥ *

భగవదర్పితములయిన యన్నపానీయ చందన తాంబూలాదులను ప్రసాదబుద్ధిచేయవలయును గాని భోగబుద్ధిచేయకూడదు॥ *

౬౮. కైంకర్యబుద్ధ్యా కర్మాణి శాస్త్రీయాణ్యేవ కారయేత్॥ *

శాస్త్రీయములయినసర్వ కర్మలను కైంకర్య బుద్ధిచే చేయవలయును॥ *

౬౯, మంత్రత్రయార్థనిష్ఠస్యమహాభాగవతస్యచ। అపచారంవినానాన్యదాత్మనోనాశకారణం। ఆత్మనోహితహేతుత్వంతస్యముఖోల్లాసనంవినా॥ *

మంత్రత్రయార్థానుసంధాన పరులగు మహాభాగ

వతులయెడల నపచారపడుటకంటె వేఱేఆత్మనాశనము లేదనియు అట్టిభాగవతులముఖోల్లాసముకంటె వేరేమోక్షహేతువ లేదనియు తెలిసికొనవలయును॥ *

౨౦. పూజనాద్విష్ణుభక్తానాంపురుషార్థో స్తినేతరః।
తేషువిద్వేషతఃకించిన్నాస్తినాశనమాత్మనః॥ *

మహాభాగవతపూజకంటే వేరే పురుషార్థము లేదనియు వారలయెడ ద్వేషముకంటే వేరే ఆత్మనాశకారణము లేదనియు తెలుసుకొనవలయును॥ *

౨౧. అర్చ్యేవిష్ణౌ శిలాధీర్గురుషునరమతిర్వైష్ణవేజాతిబుద్ధి। ర్విష్ణోర్వాష్ణవానాంకలిమలమథనే పాదతీర్థేంబుబుద్ధిః। సిద్ధేతన్నామమంత్రే సకలకలుషహే శబ్దసామాన్యబుద్ధిః। శ్రీశేసర్వేశ్వరే శేతదితరసమధీర్యస్యవానారకీసః॥

భగవదర్చావిగ్రహములయందుశిలాదివికారబుద్ధియు ఆచార్యునియందు నరబుద్ధియు, శ్రీవైష్ణవులయందు జాతిబుద్ధియు, సకలపాపహరమైన భగవద్భాగవత శ్రీపాదతీర్థమందు సామాన్యజలబుద్ధియు, భగవన్మంత్రమునందు సామాన్యశబ్దబుద్ధియు, సర్వేశ్వరుడయినశ్రీయఃపతియందు దేవతాంతరసమబుద్ధియుగలవాడు నిత్యనరకప్రాప్తడవును॥ *

౨౨. శ్రీమద్భాగవతార్చనంభగవతః పూజావిధేరుత్తమం।శ్రీవిష్ణోరవమాననాద్గురుతరంశ్రీవైష్ణవోల్లఙ్ఘనం।
తీర్థాదచ్యుతపాదజాద్గురుతరంతీర్థంతదీయాంఘ్రిజం। తస్మాన్నిత్యమతంద్రితోభవసతాంతేషాంసమారాధనే॥ *

భగవదారాధనమునకన్న భాగవతారాధనముత్తమ

మనియు, భగవదపచారముకన్న భాగవతాపచారము అత్యంతక్రూరమనియు, భగవత్పాదతీర్థమైనగంగకంటేభాగవత శ్రీపాదతీర్థము అధికమనియు తెలిసియట్టిభాగవతులసమారాధనమందుజాకరూకులైయుండవలయును॥ *

ఈడెబ్బదిరెండువార్తలు నుపదేశింపగానే శిష్యులు యిప్పుడుక్రొత్తగా నీవిశేషార్థములనుపదేశించుటకు కారణమేమనిశంకింపగా ఉడయవరులును దాచరాదనియెంచి నేటికినాలవదినమందు పెరియపెరుమాళ్ల తిరువడిఘళనారోహించుతలంపునన్నామని కారణమును తెలియజేసి వారల దుఃఖోపశాంతికై కొన్నియుపాయంబులను చెప్పి దుఃఖోపశాంతిచేసినపిమ్మట నీశిష్యులందరును దండముసమర్పించి మాకుదేహమున్నంతవరకు కాలక్షేపోపాయమును ఆనతీయవలయునని ప్రార్థింపగా నీపదివార్తలను సంగ్రహముగాసాయించుచున్నారు॥ *

౧. యః కశ్చన ప్రపన్నశ్చేత్సఏవం వర్తయేద్బుధః యత్ప్రపన్నస్యచాదృష్టమీశ్వరాధీనతస్తతః । నవిచారోఽత్రకర్తవ్యస్సందేహస్ఫురితోయది। మిథ్యాభవతితత్తస్య ధ్రువమాత్మసమర్పణం॥ *

ప్రపన్నుడయినవాడు తనయదృష్టఫల మీశ్వరాధీనము గనుక అందుకుతానుచింతింపకూడదు. అట్లుచింతించిన ఆత్మసమర్పణమిథ్యయవును॥ *

౨. కర్మాధీనతయాతస్యదృష్టంతత్రనశోచయేత్। అతోద్వయోఃప్రపన్నస్యదృష్టాదృష్టాత్మకార్యయోః । నిర్భరత్వానుసంధానంజానేధ్వమితివైష్ణవాః॥ *

ప్రపన్నుని దేహయాత్రకర్మాధీనము గనుక వగవంటి
నిలేదు. వగచిననా స్తికుండగును॥ *

౩. ఉపాయబుద్ధ్యాకర్మాణిమాకురుధ్వంమహాత్మకాః
మీరలు కర్మలను ఉపాయబుద్ధిచే చేయకూడదు॥ *

౪. కర్మణామేవకైంకర్య ప్రాప్త్యైభగవతోఽమతిః॥ *
మీరుచేయుకర్మములు భగవత్కైంకర్యములని తెలం
చవలయును॥ *

౫. తదీయంనామకైంకర్యం శ్రుత్వా శ్రీభాష్యమాద
రాత్। ప్రవర్తయధ్వంతల్లోకే తత్రాశక్తిర్న చేద్యది॥ *
మీరు శ్రీభాష్యమును చదువుకొని లోకమందు ప్రవర్తిం
పచేయవలయును. అందుకుశక్తిలేకున్నను॥ *

౬. పరాంకుశాదిమునిభిర్దశభిర్దేశికోత్తమైః। కృ
తంప్రబంధమభ్యస్యశిష్యేభ్యోవదతానిశం॥ *
శ్రీపరాంకుశాది పదుగురాళ్వారులు సాయించిన
దివ్యప్రబంధముచదువుకొని శిష్యులకు చెప్పవలయును-అం
దుకుశక్తిలేకున్నను॥ *

౭. దివ్యదేశేషుకైంకర్యం విష్ణువేకురుతానిశం॥ *
దివ్యదేశములయందు అముధుపడి, శాత్తుపడి, తిరు
విళక్కు, తిరుమాలై, కోవిలసమ్మార్జనరంగవల్లి మొద
లగు భగవత్కైంకర్యములుచేయవలసినది. అందుకుశక్తి
లేకున్నను॥ *

౮. కుటీరంవపి వాకృత్వామత్ప్రియే యాదవాచలే। ము
క్తాహంకారిణస్సర్వే వాసంకురుత వైష్ణవాః॥ *
మాకత్యంతప్రియమయిన యాదవాద్రియందు కుటీర

మయిన నిర్మించుకొని నిత్యవాసము చేయుదు. అందుకు శక్తిలేకున్నను॥

౯. ద్వయార్థస్యానుసంధానం యావజ్జీవ మతంద్రితాః। కుర్వంతస్సమ్యగేవార్యా నిర్భరావసతాదరాత్॥

అర్థముతోడ ద్వయానుసంధానము చేయుచు నిర్భరులయి మీరలున్నచోట నేయుండుడీ. అందుకు శక్తిలేకున్నను॥

౧౦. అయం మదీయ ఇత్యేవమభిమానవతః పరం। జ్ఞానభక్త్యాదియుక్తస్య వైష్ణవస్య మహాత్మనః। ముక్త్వాహంకారిణస్తస్య నిదేశే వసతానిశం। అయం హి చరమోపాయో నాన్యోపాయస్తతః పరం॥ ❋

జ్ఞానభక్తివైరాగ్యాదిపూర్ణులై, మీయందు మదీయులనే అభిమానముగల మహాత్ములయిన శ్రీవైష్ణవులచెంత చేరి, నిరహంకారులయి వారియాజ్ఞాప్రకారము సంచరింపుచు నుండుడీ. ఇదే చరమోపాయము గాని దీనిపైనను పాయాంతరము లేదు॥ ❋

శ్లో॥ ఇత్యేవం వసతాం లోకే మహతామధికారిణాం। త్రివిధా విషయాస్సంతి వర్తితవ్యా యథార్హతః। విరోధినోనుకూలాశ్చ సమ్మతాశ్చానుభయా ఇతి॥ యే విష్ణుద్వేషిణో లోకే విరోధిన ఇతి స్మృతాః। వైష్ణవాస్త్వనుకూలాశ్చ బద్ధాశ్చానుభయాస్స్మృతాః॥ యథా ప్రమోదం కుర్వన్తి ప్రియవస్తుసమాగమే। వైష్ణవాలోకనే నైవ తథా కుర్వంతు ధీవరాః। వహ్నిసర్పాదివద్దూరం పరిత్యాజ్యా విరోధినః॥ సంసారిణస్తృణీకృత్య కాష్ఠలోష్టతృణాదివత్। వ

ర్తితవ్యం ప్రపన్నానాం ధ్రువం తేషాం మహాత్మనాం। వై
ష్ణవానాం హి సంగత్యా సవ్యజ్ఞానం ప్రజాయతే । తేనవి
శ్వేశ్రేయసప్రాప్తిర్భవిష్యతి సునిశ్చయః॥ అతస్సర్వాత్మనా
కార్యా వైష్ణవానాం హి సంగతిః ॥ ప్రతికూలాదిసంసర్గ
మానసంభాషణాదయః । సుదూరతః పరిత్యాజ్యాః ప్రప
న్నానాం మహాత్మనామ్॥ అనుకూలాననాదృత్య ప్రతికూ
లాన్ధనేచ్ఛయా । కృతాస్యాద్యదియా పూజా సాహరేశ్శో
కదా భవేత్॥ సార్వభౌమస్య నృపతేస్తత్పుత్రం రాజసన్ని
ధౌ। యథాకృత్వావమానేన వ్యాకులం నృపమానసం। త
థా దేవస్య విష్ణోశ్చ వ్యాకులం హృదయం భవేత్॥ అర్థకా
మేచ్ఛయావాపి పూజయేన్నవిరోధినః। విరోధినాం హి త
ద్ద్రవ్యం విరోధాయైవ కేవలం॥ సర్వాభీష్టప్రదే దేవే హరౌ
తిష్ఠతి సర్వదా । తస్మిన్స్వేష్టావృతే యాచ్ఞాకృతా యదివిరో
ధిషు। సార్వభౌమస్య నృపతేః మహిష్యాః పుత్రబంధుషు। య
దియాచ్ఞాకృతా తేన నృపస్యావద్యతా యథా । తథాపా
స్యాద్భగవతో వద్యతా మహతీ ధ్రువం॥ నమానమొదనుభ
యానర్థకామేచ్ఛయాపి వా । తేభ్యః కృత్వావమానేన పూ
ర్వోపాత్తాద్వృథామతిః॥ నచ కార్యకరీ తిస్యాన్నష్టా భవతి సా
ధ్రువం॥ సువర్ణలోహయోర్లోకే యథా రత్నవరాశ
యోః। అనుకూలానుభయయో స్తథైవ మహదంతరం॥

ఇట్లు ఉజ్జీవించే అధికారికి ముందుగా విమర్శించినదువ
వలసిన విషయములు మూడు కలవు. అవి యేవన్నను - అను
కూలులు, ప్రతికూలులు, అనుభయులు, అని ముగ్గురుకల
రు. అనుకూలులు - శ్రీవైష్ణవులు. ప్రతికూలులు- భగవ

ద్విరోధులు. అనుభయులు-సంసారులు ఈమూటిలో అనుకూలులయిన శ్రీవైష్ణవులను శేవించునపుడు- చందనకుసుమ తాంబూలములనుజూచినట్లును! ప్రీతిగ్గానమంచిపదార్థములుగన్నట్లును, మిగులప్రవర్తించిసంతోషించేది. ప్రతికూలులైనభగవద్విరోధులనుజూచునపుడు-సప్పశార్దూలాదులనుజూచినట్లుభయపడిప్రవర్తించేది. అనుభయులనుజూచునపుడు-కొయ్యాను, మట్టిపెళ్లను, చూచునట్లు తృణీకరించవలయును. ప్రతికూలులైనవారను కూంలిచి రామెనా అయోగ్యయనివారిని రక్షించేది. ఇట్లువడనక్రద్రవ్యము మొదలగువాటియందాశచేత ప్రతికూలులైన వారిని. పూజించినసార్వభౌముఁడైన రాజమహిషిపుత్రులయింద్లయందు, ఒడిగట్టిభిక్షమెత్తినను రాజునకు అపఖ్యాతిగ్గానట్లుసర్వేశ్వరుని తిరువుళ్లము మిక్కిలి నొచ్చియుండును. అర్థకామాదులయందాశచేత అనుకూలులయిన-శ్రీవైష్ణవులనుగని సేవించక, ఆదరించకపోయిన, సార్వభౌముఁడైనరాజుసన్నిధిలో ఆరాజకుమారుని అవమానపరచినవాడురాజుచేతశిక్షింపబడినట్లు మర్థకామాతురినిమీద సర్వేశ్వరునితిరువుళ్లముమిక్కిలికలగియుండును. అనుభయులనాదరించినరత్నమునకును, పాషాణమునకును, వాసిమెఱుంగనట్లు. ఇట్లు పుట్టిన జ్ఞానము కార్యకరము కాదని తెలియవలసినది. *

౭౫ - వార్తలు.

సంపూర్ణము.